# శ్రీ గురుభక్తి ప్రబోధిక

—o—

శ్లో. 'జ్ఞానీ జ్ఞానఫలం వేత్తి । యోగీ యోగఫలం తథా
జ్ఞానయోగఫలం వేత్తి । దత్తాత్రేయ పరాయణాః'

జ్ఞానైకగమ్యమగు మోక్షమునే యెల్ల రపేక్షింతురు. తత్స్వరూప మెట్టిదనిన, సృష్టిగానిట్లు భాసింపనితఱిఁ గర్మసహితమైనజీవు లవిద్యతోఁ గూడి మాయలోలీనమై బ్రహ్మమునందు ఛాయాపురుషరూపమున నభేదముగానున్న ట్లెంచనై యది సజాతీయ విజాతీయ స్వగత భేదశూన్యమగు నద్వితీయ సచ్చిదానందమయ మన నొప్పెను. క్రమముగా జీవులయొక్క కర్మపరిపక్వతనుబట్టి బ్రహ్మమునకుఁ దాను బహుత్వమునంద సంకల్ప ముదయించినంతనే 'శబలత' యేర్పడి తమఃప్రధాన ప్రకృతివల్లఁ బంచ భూతములును, దత్పంచీకరణమున సమష్టివ్యష్టిరూప స్థూలసృష్టియుం గానయ్యెను. ఇట్లవిద్యాప్రతిబింబితబ్రహ్మమే పరిచ్ఛిన్నోపాధి స్థితివలన ననేక జీవరూపములుగా దేహత్రయావస్థాత్రయ పంచకోశ చతుర్వింశతి తత్త్వావచ్ఛిన్నత నంది యనృత జడ దుఃఖాత్మక ప్రపంచకముగా భాసింపనైనది.

అజ్ఞానావరణమున నిందుఁ బరస్పరాధ్యాస ముదవుటవలనఁ దత్తద్భ్రాంతు లేర్పడుచుండును. అందు (1) జీవేశ్వరభేదరూపాది భ్రాంతులు బింబప్రతిబింబ దృష్టాంతమువల్లను (2) అంతఃకరణ తాదాత్మ్యమువలనఁ గలిగిన కర్తృత్వ భోక్తృత్వ భ్రాంతులు తత్సంబంధములేని సుషుప్తిలో లేని వౌటచే రక్తవస్త్రపరిస్థిత స్ఫటిక వర్ణ తుల్యతవల్లను (3) దేహము దృశ్యము నాత్మ ద్రష్టయు నాచుండఁగా, దేహాత్మభావమును దాన నేర్పడిన మమత్వముంగొల్పు సంగభ్రాంతి ఘటోపాధిస్థి తాకాశచలన సాదృశ్యమువల్లను (4) బ్రహ్మచైతన్యము నాశ్రయించియున్న మూలావిద్య ప్రారబ్ధవిశేషమున సంక్షోభమొందఁగా, జడచైతన్యమైన ప్రపంచరూపవికారమును బొందుటంగలుగు వికారభ్రాంతి రజ్జుసర్పోదాహృతినిబట్టి యవిద్యాపరిణామమైన యీప్రపంచకమెల్ల నధిష్ఠానమగు బ్రహ్మచైతన్యమునకు వివర్తముగాఁ దెలియుటవల్లను (5) జగత్సత్యత్వభ్రాంతి యన్ననో, సువర్ణకుండల సదృశతంగాంచి తత్కార్యకారణ భేదమునెంచి యస్తిభాతి ప్రియావస్థితినందు శుద్ధబ్రహ్మమునందు జగత్సంబంధమునఁ గల్పితములైన నామరూపములు మిథ్యయని తెలియంగలుగుటవల్లను క్రమక్రమముగా వారించుకొన వలసియుండును.

ఈ యజ్ఞానమెల్లఁ గేవల కారణశరీర సంబంధియేకాని, తనదెంతమాత్రము గానేకాదనియు, నవస్థాత్రయము నట్టిదేయనియు రూఢముగాఁ దెలియవలయును. ఎట్లనఁ దానను దీపము వెలుఁగుచుండు నాటకశాలవంటి యీ స్థూలదేహమునం దాచిదాభాసుఁడే ఱేఁడు, మనసు మంత్రి, బుద్ధి నాయిక, ప్రాణములు సేవకులు, దశేంద్రియములు వాద్యములు, శబ్దాది విషయములే సభాసదులుగాఁ బ్రవేశించి వ్యవహరించినకాలమే జాగ్రదవస్థయు స్వప్నావస్థయునై, నాటకములేనివేళయే సుషుప్తియౌచున్నది. అప్పుడును దాను సాక్షిగా నుండక మానఁడౌటనే యాయనుభవమును నిద్రలేచినవెనుకఁ జెప్పఁగలుగు చుండును. ఇంద్రియాంతఃకరణసాహాయ్యమున జాగ్రత్తునందును నంతఃకరణమాత్ర సహాయమున స్వప్నమందును నసహాయముగనే సుషుప్తిలోను దాను బ్రకాశించుచు నాయా యవస్థలను గుర్తింపఁగలుగుచున్నాఁడు.

ఇట్లు స్థూల సూక్ష్మ కారణములనెడు శరీరత్రయముకంటెను, జాగ్రత్స్వప్న సుషుప్తులనెడి యవస్థాత్రయముకంటెను, నన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమ యానందమయము లనెడు కోశపంచకముకంటెను, జ్ఞానేంద్రియ పంచకము, కర్మేంద్రియపంచకము, ప్రాణాదివాయుపంచకము, శబ్దాదివిషయ పంచకము, నంతఃకరణచతుష్టయములనెడు చతుర్వింశతి తత్త్వములకంటెను వేఱై వీనికన్నిటికిని సాక్షిగానున్న బ్రహ్మమనేతానని 'తత్త్వమ'స్యాది మహావాక్యావబోధమువలనఁ దెలియవలెను. అజ్ఞాన, మాయావిద్యా నివృత్తియుఁ దత్కార్య సహిత ప్రకృతి నివృత్తియుం బిదపఁ బ్రకృతిబ్రహ్మసంబంధ నివృత్తియు, నంత జీవేశ్వర భేదభావ నివృత్తియుం దరువాతఁ గర్తృత్వ భోక్తృత్వ బంధ నివృత్తియుం గలిగి, తుదకు దుఃఖనివృత్తియై, క్రమముగాఁ బరమానందరూప బ్రహ్మ ప్రాప్తి కావలెను. అట్టిదే బ్రహ్మవిద్వరిష్ఠత యనిపించుకొనును. ఇట్లు జీవ బ్రహ్మైక్యానుభూతికలుగ నపరోక్ష జ్ఞానసాధనముగా శ్రీ శాఙ్కర బ్రహ్మను చింతనస్థంబైన రీతిని 'బ్రహ్మైవాహమ్ న సంసారీ, ముక్తోహ'మ్మన్న ముక్కలు పెదవులమాత్రమేకాక మనమునకంటవలెను. అట్లౌట యెంతటి మహాసాధకులకో కాని సార్వజనీనము గానేరదు.

కావుననే సర్వలోకతారకముగా 'భక్తిర్నిశ్రేణికా పర'మ్మనిరి. 'భక్తి' యనఁగాఁ బూజ్యులయెడ ననురాగము కలిమి. ఆయనురక్తియన్ననో, 'అంకోలం నిజబీజసంతతి, రయస్కాన్తోపలం సూచికా సాధ్వీ నైజవిభుం, లతా క్షితిరుహం, సింధు స్సరిద్వల్లభం ప్రాప్నోతీహ యథా తథా' యని జగద్గురు ప్రబోధితమేయాయె. ఇట్టి 'గౌణీభక్తి' ముం దలవడిన, నదే 'పరాభక్తి'కిం ద్రోవఁజూపి, క్రమముగా స్వస్వరూపాను సంధానమున కిరవయ్యెడిని. అద్దానికైన, సాకారరూపకల్పన మత్యావశ్యకము కాఁగా నమ్మూర్తి త్రితయమును దత్తదవతారములును వివరింపంబడనయ్యెను. దాన, మతభేదము లుత్పన్నములు

కాకమానవయ్యెను. కాఁబట్టి యైకమత్య సంపాదకముగా నా త్రిమూర్తి స్వరూపము నే యెల్లరుం దెలిసికొని, 'శ్రవణం కీర్తనం విష్ణో స్స్మరణం పాదసేవన మర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదన'మ్మన్న చందాన భక్తినెఱపుటే సర్వశ్రేయోదాయకము.

ఈ త్రిమూర్తి యోగమార్గ ప్రతిష్ఠాపనముఁ గావించి లోకానుగ్రహంబు సేయ ననసూయా గర్భశుక్తి ముక్తాఫలంబై యీధాత్రిం దొలుత నవతరించెను. తచ్చరిత్రము పురాణప్రసిద్ధము. 'భూమివలన సైరణయు గంధవహుని వలన బంధురంబగు పరోపకారంబును......నుదకంబువలన నిత్యశుచిత్వంబును నగ్నివల్ల నిర్మలతయు......వననిధివలన నుత్సాహరోషంబులును, శలభంబువలన శక్త్యనుకూల కర్మాచరణంబును, భృంగంబువలన సారమాత్రగ్రహణ విశేషంబును, స్తంబేరమంబువలనం గాంతావైముఖ్యంబును ......శరరంబువలన మోహపరిత్యాగంబును ......నూర్ణనాభివలన సంసారపరిత్యాగంబు' నిట్లు 'ప్రవిమల విజ్ఞాననిపుణ భవ్యులుగురువుల్ దవిలిన నిరువదినలువురు నవని న్విజ్ఞాని నైతి'నన్న యనఘాతుం డీతండకాదే? ఈతఁడు సత్యానంద చిదాత్మక సాత్త్వికాకారంబుఁ దాల్చి, స్మరణమాత్ర సంతుష్టివెలయ సర్వకామ ఫలప్రదాతయై, భవబంధ మోచనముఁ గావింప నే సదాదత్తో౽హమస్మి' యని మనల నందఱఁ దరింపంజేయ నిందే గుప్తతం గనియున్న మహాయోగిపుంగవుఁడు.

అట్టి శ్రీదత్తాత్రేయమూర్తులను గూర్చి తత్తత్పురాణగ్రథితాంశములను సేకరించి తదనంతరావతారకథాసహితముగా మహారాష్ట్రభాషలో నొకసరస్వతులు 'శ్రీగురుచరిత్ర'మన విరచించియుండ, నద్దానినే 'సంహి'తాఖ్యముగను శ్రీదత్తపురాణాదికముల నింకెన్నిటినో శ్రీ శ్రీవాసుదేవానందసరస్వతులు జ్ఞాన కర్మ భక్తి కాండాత్మకములుగా గీర్వాణంబునం బలికి పలికి, సర్వోపాసకమననయోగ్యము గాఁదగునట్లు తచ్చరిత్రాంశస్ఫోరక శతకరూపమున 'శ్రీదత్తభావ సుధారసము'ను గూర్చి ప్రసాదించియున్నారు. అద్దానిని శ్రీకాశీవాసులైయుండిన శ్రీ శ్రీ బ్రహ్మానందసరస్వతులు తాము హృద్గతమొనరించికొని లోకోపకారకముగాఁ బ్రచురపఱచియుండిరి. వారే నన్నుఁ బ్రోత్సహించి శ్రీగురుసంహితాంధ్రీకరణ రూపమైన 'శ్రీగురుదత్త సరస్వతీయము' రచియింపఁజేసిన వెనుక 1937 లో నిచ్చోటికి విచ్చేసిన తఱి, నీ'సుధారసము'ను నన్నాస్వాదింపఁజేసి, తెలుఁగుపద్యములుగా వ్రాసియిమ్మని కోరుచు, మూలగ్రంథమం దుత్తరార్ధమున శ్రీగురుసంహితా కథాంశము లతిసంగ్రహముగా నుంటచే వానిని సాధ్యమావఱకు విపులీకరింపుమనికూడ నాదేశించిరి. అట్లది యొనర్పంబడి తద్ద్వారమునఁ బదుగురినోళ్లలోఁ బడియుండెను.

ఇప్పు డద్దాని నింకెందఱెందఱో తమతమ వాక్కుల కెక్కించికొఁ గుతూహలపడి యడుగుచున్నారు. అట్టి శ్రీగురుదత్తోపాసకులందఱి తూమాటు

వాస్తవ్యులు శ్రీకాళిదాసు శంకరయ్యగారు నాకపరిచితులయ్యు వారల ద్వారమునం దెలిసికొని నాకు వ్రాసిన లేఖయే యిద్దాని నేతాదృశ భక్తాగ్రగణ్యుల కందింపను శ్రీదత్తపురాణాంధ్రీకరణము నింకసాగింపను గూడఁ బ్రోత్సాహకము కానా టుభయతారకము.

ఉ. చిత్తమున న్సదా నిలిపి, చేతులుమోడిచి మ్రొక్కెదం గృపా
యత్తుల దత్తుల; న్మహి, నుపాత్త మహాత్తమ విత్తి, నిత్తఱిన్
బత్తి సనస్వతు ల్గొలుపు బాటల, నేటగు సూటిఁ గాంచనా
దత్తకథాసుధానుభవ తర్పితచిత్తుఁ నుద్ధరింపఁగన్॥

బందరు
మన్మథమార్గశీర్షము } నాదెళ్ల మేధాదక్షిణామూర్తి



శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః

# శ్రీ దత్తభావసుధారసము



శా॥ శ్రీమంతంబులు ముక్తికాంత పదముల్ చిత్తంబునన్నిల్పి, స
ద్ధీమంతుం బురుషోత్తమున్ గొలిచి, కీర్తిన్మనుషే మంతులై
భూమిన్మించిన సంస్కృతాంధ్రకృతులన్భాషించి, భాషింతు మే
ధామూర్తిట్కృపవాసుదేవ గురుపత్తిస్తోత్ర మాంధ్రంబునన్ ॥

శా॥ ఆనాఁడా "గురుసంహితం" దెలుఁగు సేయన్లెక్కఁ దాఁబ్రాయుమా
త్రాసన్నే నతిభక్తిమెసటు లోనప్పంగాంచి సంప్రీతి, బ్ర
హ్మానందుల్ కృపనీసుధారసము డాయన్వచ్చి యందించి ఏ
య్యానందైక నిధానమయ్యెడను ధ్యేయప్రాభవంబయ్యెడున్ ॥ 2

మత్త॥ ఇత్తఱిన్ ఘనవాసుదేవ యతీశ్వరోక్త మిదీకృతిం
జిత్తజాంతక సత్కృపాప్తిరచింప నాంధ్రవచస్తతిన్
బత్తిదీనిఁ బఠించిన న్విన భాషశుద్ధివలిర్చెడున్
"దత్తభావసుధారసంబు" సదాప్రమోదదమయ్యెడున్ ॥ 3

శా॥ నేఁగొల్తున్స్మృతిశీఘ్రప్రమేయు, దితిజానీకాంతకుం దేయర్షి రా
డ్యోగిధ్యేయుని, వేదగేయుని, నమేయుం, బ్రాప్తసత్త్వాయు, దు
ష్టాగమ్యాన్వయభావగమ్యపరసౌఖ్యాధేయు, నిత్యప్రధా
నాగణ్యైక జయప్రణేయు, సలపత్త్రాత్రేయు, నిష్టేయిలన్ ॥ 4

ఉ॥ పాపమడంచి, రిక్తతను బాపి, భయంబు శమింపఁజేసి, సే
వాపరతంత్రులైన శిష్యపాళి వెడం గృపమీఱ మంగళో
త్థాపక నవ్యకీర్తి వరదాయివి నీవయి ప్రోచుచుండు ద
త్తా! పృథివీనియంత! పరమాత్మ! యిదే నతినీకు, సద్గతీ॥ 5

కం॥ ఏకకటిసౌభాగ్యదునకు। దిక్కాలలోకాధిపతికి, ధ్యేయాద్భుతికిన్
బ్రమొక్కులివే పితాత్రికి। నెక్కాలము దత్తమూర్తి కిష్టాపికిలన్ ॥

మ॥ సతతంబేనిఁక సంస్మరించెదను యుష్మత్పాద పంకేరుహ
ద్వితయంబున్, హతఖేదమున్ సుఖద, ముద్వేలప్రసాదంబు, మ
న్మతి నుద్భూతములౌ వికారములడంపన్వేగ మాదేన, నం
చిత సద్భావమదీవొసంగవలయుం జిద్రూప ! దత్తప్రభూ॥ 7

మ॥ మలినంబై తగుచిత్తవృత్తిని శమింపంజేసి, క్షిప్రంబేని
ర్మల సద్భావముఁగూర్పఁగా నఖిలసంపత్కల్పకంబా శ్రితా
ర్తులసద్బంధుని, సర్వశోధనసమర్థు,న్సంగహీనుంగృపా
జలరాశిన్మది నత్రిపుత్త్రును నజస్రంబేను ధ్యానించెదన్ ! 8

చ॥ సముదితసద్యశః ప్రథిత సర్వదిగంతరుఁడౌచు, నెల్లభూ
తములను లోపలన్ బయటఁదానగు నిర్జితభక్తకాలుఁడు
త్తముఁడవధూతులందెవఁడతండు మహామహుఁడత్రిపుత్త్రుఁడో
రిమిమెయి నెల్లకాలము ధరిత్రినిసాఁకఁగ మాకు దిక్కగున్॥ 9

శా॥ ఈధాత్రీస్థలికెల్లఁ గర్తయయి, యిట్లీమాత్రముంగానిమై
నేదో వేసముఁ దాల్చుచున్మనుజుఁగా సంచరింపంగ నా
నాధివ్యాధిభయార్తి రిక్తలఁ బాయంజేయభక్తాళి యా
రాధింపన్ స్వవశారిహార్త యవుచున్ రక్షింప దక్షుండహో॥ 10

కం॥ భావికరక్షణకొఱకయి।యీవిగ్రహమంచె విష్ణువనసూయకిల
న్భావింపఁగనాకల్పం।బావేధకెకాదుగోనము, లన్యులకౌనే? 11

ఉ॥ ఏ మహిమాభిరాముని యహీన నవీన లసత్కటాక్ష వీ
క్షామృతసేచనంబున నిహానఁబరానను దాపమాఱి, యెం
తో ముదమారఁగాఁగలుగునో గతిగల్గునొయట్టి యాపరం
ధాముఁడు మన్మనోవికచతామరసంబున ధామమొందెడున్ 12

ఉ॥ బాధలెడల్చి సత్త్వమెదఁ బాదుకొనం బొనరింప మన్మనో
వీధిని సంచరింపఁదగు వీరదిగంబర దివ్యమూర్తి! యా
వేధ లిఖించె నానుదుటఁ బీడలకీడుచు పాడువ్రాఁత, ని
ర్బాధక మద్దిసేయఁగ శుభప్రతిపాది! విధాత ! నీకగున్॥ 13

ఉ॥ శ్రీరమణీయ భవ్యశుభచిహ్నితమూర్తివి, సర్వసంపదు
ద్ధారక దివ్యకీర్తివి, నితాంతచతుర్దశ లోకపాలనా
ధార కళాప్రపూర్తివి కృతార్థతగల్గదె? దత్తమూర్తి! యిం
పారఁగ నీకృపారసము నానిన మాత్రన కానిదేదిలన్? 14

కం॥ మామోహపుఁబెంజీఁకటి। పాయమన్నీకాలిగోటి రత్నద్యుతియే
యామే లెది యేటికి? జ్ఞానామృతదివ్యప్రకాశ! యతిలోకేశా!

కం॥ భావత్కకటాక్షేక్షణ। మావంతకృపారసార్ద్రమై పరిసరింపం
గావించుననను ధన్యుఁద్వా। దావిష్టతకూడనందనర్హ్వాతఁగందున్॥

కం॥ హీనుఁడనధమాధముఁడను। నేనేడనో! దేవదేవ! నీవేడనో కో!
యైనన్భవదావేశా। నూనోన్నతి నేకటాక్షమొదవించుఁగదా॥ 17

కం॥ నేనిన్నియంచుఁ జెప్పఁగ। లేనన్నిటిమున్నఘావళిం జేయంగా
నైనను నీకృపవల్లను। గానెపవిత్రుండ? శంకకలదే యింకన్?

ఉ॥ నీవు స్వలీలంగద పునీతులఁ జేయుదు లోకులెల్లరం
గావున నీచరిత్రవినఁగా నవకాశము నాకుఁ గూర్పుమో
దేవర! దానఁదీవ్రనయదృష్టి యొసంగఁగ నెంతయేనియుం
బావనతంగనంగలుగు భాగ్యముఁగందును దత్తసత్ప్రభూ! 19

ఉ॥ నీదరి నున్నదున్నటుల నేనువచింపక తప్పు, దెవ్వఁడే
నౌదునుసుమ్ము పాపనిలయుండను సందియమింత లేదిఁకన్
నాదురితౌఘమెన్నుటయనంగఁ బ్రభూ! వినుమ, పాంసురేణువ
ర్షోదిత బిందుజాలముల నొక్కటి రెండని లెక్కవెట్టుటా॥ 20

కం॥ నాకంటెఁ బాపకర్ముఁడు। నీకంటెఁ గృపాప్రపూర్తి నేఁగాననెట్లన్
నీకరుణాపాత్రతఁగన। లోకమ్మున నేన్నుగాక లొచ్చువునెవ్వఁడేన్

కం॥ మీమదియేకృపకలదేన్। మామక దశ కాంచితనంత మానునె
కరఁగన్
గామిని నాదురదృష్టం। బేమనిమీముందుపల్క నేర్పడునింకన్

కం॥ నీవల్లనె మాపోషణ । కావలెననునట్టి బీదకసుఁగందులమే
మీవేమెల్లరతండ్రివి। కావే? గురుదత్తమూర్తి! కరుణాపూర్తీ
కం॥ నీబిడ్డఁడనేఁగాఁగా । మాబాబవు, తల్లివీవ, మహిలోఁగావా?
నీబంధురకరుణామృత।మాబూతిగఁ ద్రావదేవ! యతివరయమీవా?

కం॥ దత్తా! కర్త! యభిన్నని। మిత్తోపాధానతాప్తి మీసూనుఁడ నే
సత్తౌద జగద్యోనీ । చిత్తేజము మెఱయ సేలఁజెల్లదెనీకున్? 25
శా॥ ఓ విశ్వాత్మక! విశ్వసాక్షి! నతసర్వోర్వీజనానీక! నా
కీవేకాఁకిఁక దిక్కులేరెవరు తండ్రీ! బిడ్డ నేఁగానె? నే
నేవేనజ్ఞతఁజేయు తప్పులను నీకెంచంగ న్యాయ్యంబె? స
ద్భావంబొప్ప నుపేక్షసేయ కెటులేన్బాలింపు మాలింపుమీ॥
చ॥ తెలియమిచేతఁ గొంతయు విధిన్విహితంబగురీతిసల్ప దు
ర్బలత మఱింతయుం నఱచుప్రాప్తములోఁ బొరపాట్లుసత్కృపా
జలనిధి! చూచిచూడనటులెంచి నను న్మననిచ్చుచుండఁగా
వలయును, గానినేమొనసుసంగల సేవిల నో మహాప్రభూ! 27
ఉ॥ ఈ తెఱఁగైన తప్పుల ననేకము లేనొనరించుచుంట నీ
చేతనుమందునే యనుము, చీఁదఱనొందుచు మోఁదనందమే?
భూతలమందు బిడ్డచనవుంగొని కాలను దన్నుఁగాక, యే
మాత మనంబునం గినిసి మానునొ తానిల నాదరించుటల్! 28
చ॥ తన తొడమీఁదనుండి సతతంబును నేస్చుచుఁగాళ్లఁదన్నుచుం
డ నగు నభాగ్యనేన్సుతు ననావరణంబునఁగూలఁద్రోయునే?
జనని ప్రపంచమందెటను, జల్లనిమాటల బుజ్జగించుటో
యనునయమార్గమన్యమెదొయాఁగయుటోకద చేయఁజూచెదున్
శా॥ ఏమోలెమ్మని యిట్టిమర్త్యుఁడ నేనెంతెంత చింతించినన్
స్వామీ! నాదెసదృష్టియే పఱచియాశ్వాసింపఁగానెంచవేఁ
బాముల్ చెందుచు డిందుచుందుఁగద నిర్భాగ్యుండనై ముందు ది
క్కేమొకో? మఱినీపుదక్కగతి యన్యంబేది ? దత్తప్రభూ॥

మ॥ పసిపాపం డొకొ! మోసకాఁ డితఁ డిటుల్ స్వార్థప్రియత్వంబునన్
గుసిలించు న్మసలంగ నీఁడనుచు నీకుందోఁచునో యేమొ, కా
దుసుమీ! యాఁకొన 'నమ్మ' యేనడుగ కెందుం బెట్టఁగా విందుమే?
విసుపుం జెంద కమందమా కృపనిటు వీక్షించి రక్షింపుమా॥

మ॥ తలి కోపించినఁ దండ్రి గారవమునంద న్బాలగున్ దండ్రి కూఁ
కలు వేయంగను దల్లి బుజ్జనములోఁ గంబం బెట్టనందుమే!
తలియుం దండ్రియు నొక్కయీవయగుచున్ దండింప నాకండయి
య్యేలలో లేదిఁక వద్దు నిర్దయత స్వామీ! దత్త! భక్తావనా॥

మ॥ ధర నేరెవ్వరు నమ్మి నిన్గొలిచి రేతద్భక్త లోకాగ్ర్యు లె
ల్లరిలన్ దారుకృతార్థతం బడయు లీలం గాంచి యస్మద్విధం
తరమందుం బదికించి నీవలన నుద్ధారంబు సిద్ధింపనే
శరణంటిన్ గురుదత్తమూర్తి! కరుణాసారంబు వర్షింపవే॥ 33

మ॥ ఎపుడున్నీపద పంకజాతములయందే శ్రద్ధ నీయంచె తో
రపుటాసక్తి యొసంగు భక్తుల కనర్థంబుల్ నివారించి, ని
క్కపు సౌఖ్యంబు ఘటింపఁజేయుదనుచు న్గాన్పింప శాస్త్రంబులం
దిపుడే నిన్శరణంటి, దత్త! నను రక్షింపంగ వేరాఁగదే॥ 34

మ॥ భగవంతుండగు భక్తవత్సలుని నిన్ గొల్వంగ నొల్వ నేనాఁటికేన్
సుగముం గూర్చి యనుగ్రహింపఁ జెయటంచు న్నమ్మి ప్రాణమ్ములన్
బిగియం బట్టుచు నెట్టుచున్ దినములుర్వి న్నిన్నె ధ్యానించుచుం
దుఁగ దాదత్త! మహానుభావ ననుభక్తుం బ్రోవవే యిప్పుడేన్॥

మ॥ వినుమీ, నీపదభక్తితో మెలఁగుదు న్విశ్వంభరామండలం
బున నాదంచిఁక నేది లేదరయ, నెప్డు న్నీకధీనుండ, న
ర్పణమా నీతనువు న్మనోధనము సర్వంబిప్డ నీ, కో జనా
ర్దనమూర్తీ! కృపదత్తమూర్తి! యిఁకమీఁద న్నాపయిం
గొల్పుమా॥ 36

మ॥ ఎఱుఁగ న్నిన్నెడ బత్తిసేయు టెటులో యేరీతి నర్చించుటో
మఱి యేదానము లైనఁ జేయుటో స్వధర్మం బైన నేమాత్రమేన్

నెఱపంబూచుటా ! పద్యములుటొకటే నే నేర్చితిం గూర్చితిం
గరుణ న్నీవిని జిత్తగించుచుఁ గటాక్షంబు న్బ్రసాదింపుమీ॥37

చ॥ విధివిహితంబుగాఁ దొలుత వేదము నధ్యయనంబొనర్పలే
దధికతరప్రయాసమున కాదట నోరిచి బ్రహ్మచర్య సం
పదపొదలించికోనయితిఁ బైన నిదిప్డు గృహస్థధర్మమే
నధమము తిన్నఁగా నడువదయ్యెను జెప్పితిఁ దప్పుసైఁపుమీ॥

కం॥ లేదయ్యా సత్సంగతి। లేదెయ్యెడ విబుధసేవ లేదిఁక ధర్మ
కాదృతిమైననుదత్తా! నీదయయే యాదరువని నిన్నరణంటిన్॥ 39

కం॥ ఒప్పెఱుఁగుదుఁ దప్పెఱుఁగుదు।నొప్పెప్పుదుబుద్ధి, తప్పునోరనె
చనుఁదా
నెప్పుడు మదిఁ దగు దత్తా! యెప్పనికిం బురికొలుపుదొ
యే నదొనర్తున్॥ 40

ఉ॥ తాపసలోకవందితపదా ! సుగుణత్త ! సదాధరిత్రినా
కేపనిచేసిన న్నాటియు నెయ్యెడఁ గొల్చిన నేడకేగ ని
చ్చాపరివర్తనంబునను సంతతచింతను సంస్తుతిన్ మనో
వ్యాపృతినైన నెవ్విధి భవద్విషయైకనిరూఢి యబ్బుతన్॥ 41

మ॥ విను నశాంతముఁ గొల్చువారలకు శాంతింగూర్పఁగాఁ జూడకు
న్నను దద్భక్తులు దిక్కుకానకిలలో నాశంబునేకాంత్రునా
ననుమానంబొకొ! దత్తమూర్తి! వినుమయ్యా నెమ్మదిన్నన్నుఁ గూ
ర్చిన యాలోచనమున్న నే యిఁకను నాజీవంబులే న్నిల్చెదున్॥

ఉ॥ వచ్చియురాని మాటలను బల్కెదనేవిరొ! వానిలోన నే
పొచ్చము లేమినెంచి యెటఁబొల్లులు గల్గిన వానినెల్లఁ బో
నిచ్చుచు నన్ను బిడ్డని నభీప్సితమారఁగఁ బ్రోవవేని నా
కెచ్చటనేని దిక్కుగలదే? వలదే యిలఁదేర్చు టెమ్మెయిన్॥

మ॥ అతిలోకప్రతిభావిశేషుఁడవు నిన్నగ్గించి దానం బ్రస
న్నతనందించికొన న్సమర్థుఁడనె ? మందప్రజ్ఞుఁడన్నేమ నా

క్ర్పతురత్వంబునఁ బేర్మిఁగాంచునలకంజాతోద్భవాదుల్సను
ర్థతలేమిన్వేను కంజవేయఁగ నుదాత్తస్ఫూర్తిదత్తప్రభూ! 44

మ॥ పరిణతానేకమనోబ్జసంతతవిహారా! దీనమందారా! పా
వనలోకోత్తరదివ్యసచ్చరిత! సర్వజ్ఞా! కలాపూర్ణ! నీ
వనుకంపామతి నీకుబొట్టైనను నేనన్నట్టివేతప్పులై
వనుమన్నించుచు నాలకింపనగు నెన్నంబోక, దత్తప్రభూ! 45

శా॥ శ్రీదత్తుండవెలింగెదుగా నతము, మచ్చిత్తంబునందిత్థిరతిగా
గాదేపూతిము? దత్త! నీకిదెనమస్కారంబు నీకంటెఁ బ్రా
పేదైనగా శ్రుతిగోచరంబగునె? నీకేదాసుఁడగాగానె? నీ
మీఁదనున్నస్థిరభక్తి నాకగుత, స్వామీ! నన్ను రక్షింపవే। 46

కం॥ తాఁదాన యాత్మదానము చేదత్తుఁడమీఁకటంమఁ జెప్పనో
యీశుం
డాదట ననసూయాత్రిజుఁ। డాదత్తుఁడెనాసునెరకు నాదనువాలెగా॥

మ॥ కృతవీర్యాత్మజుఁడైన యర్జునుఁడెదంకిలి ప పష్టాంగయో
గ తత్త్వప్రజ్ఞయుజ్ఞానసిద్ధియునుగల్గంజేసి యవ్యాసాత్ర
దురితగామిత్వముతోఁ దిరిలోకములయందున్సంచరింపన్సను
ర్థతనేతండానగూర్చె నామహితుఁడౌ దత్తుండె నాకండయాగా॥

కం॥ భ్రమలడఁచు బ్రహ్మవిద్యను। బ్రమగల్గనలనగ భూమిపతికతఁ
డిచ్చుటగా
బ్రమదముఁగూర్చె గురూత్తముఁ।డమలుండాదత్తమూర్తి హరు
విడునాకుగా 49

కం॥ ఇరువదినలువురు గురువుల।పరిచితిగుణమెది గ్రిహింపవలయునో
దేనగా
వరుసనెవండిలఁజాటెనో। శరణ్యుఁడాతఁడలదత్తసంయమి నాకుగా

చ॥ అమలమదాలసా కువలయాశ్వతనూభవుఁడౌనలర్కభూ
రమణునియందనుగ్రహ పరత్వము తేటపడంగ యోగపూ

ర్వముగనునాత్మవిజ్ఞత నెవండొనగూర్చెనో తన్మహాత్ము పా
దముల సదామదిన్నిలిపెద స్మరణందునుదత్తమూర్తి నేన్॥ 51

కం॥ సేవాధర్మపరాయణుండౌ ఏనస్పృహుడాయువునకునమలసుతాప్తిం
గైవల్యసిద్ధిగూర్చెనో। దేవుండా దత్తగురుండె దిక్కానాకున్॥52

ఉ॥ బాపడు విష్ణుదత్తుడను భక్తుడు పైత్రికమందు సత్ఫల
ప్రాపకుడంచు భోక్తృతను నెమ్మది కోరిన సమ్మతించి లో
కోపకృతిం బొనర్చుటకు యోగరహస్యము లెల్లజెప్పె, వి
ద్యాపరిపూర్ణుడేతడల దత్తమహాత్ముడె నాకు దిక్కగున్॥53

చ॥ తనపతి కార్తవీర్యజ విదారితుడౌ జమదగ్నినొక్క కొ
మ్మునను ఏననొక్కటన్ సుతుని మోయగ రాముని గోరిచేర ద
ర్శనమిడి యల్ల రేణుకను సర్వవిదుండెవడందజేసె భ
ర్తృనుగమనైక సత్పథము నాతడె దత్తుడు నాకుబ్రాపగున్॥

చ॥ అమలపథంబునం జన నిహంబున నెవ్వడు సోమకీర్తి భూ
రమణునకు స్వమూలమయి రంజిల నాహ్నికకర్మ మర్మముల్
క్రమముగదెల్పి యంతటం దిరంబుగ బొంబుగరంబుగూర్చు స
ర్వమునుది కెక్కజేసె నలభవ్యుడె దత్తుడు నన్ను నోమెడున్॥

ఉ॥ మేదినిపై సన్యముగు మేకురభక్తిని జింతసేత ని
ర్వేదము నొందు నార్తునలివేల నుతిన్మతిముష్టినంది యా
మోదమెలర్ప దర్శనము ముందొనగూర్చెనో నామధారకున్
బోధిదిగానంగ నమ్మహితు బుద్ధిదలంచెద దత్తమూర్తి నేన్॥56

మ॥ కలి కంజాతభవ ప్రసంగ విషయముం గల్పించి దాన, న్యుగం
బులధర్మంబుల నుగ్గడించి గురులన్పూజింపదత్సేవనే
మెలగన్ దీపకునట్లు మాధవుల కూర్మింగాంచ నౌనంచు సి
ద్ధులబల్కించుట నుద్ధరించుఘను నెంతుందద్గురూత్తంసులన్॥

మ॥ ప్రీతియానాశ్రితు నంబరీషనృపు గావన్వచ్చి దుర్వాసుడ
త్యతికోపించి శపింపజేని నదితానందంగదత్సమ్మతిన్

క్షితిలో నిర్వదియొక్క మార్గ వర్తించెన్ శిష్టలోకైకవం
దితుఁడేతండలదత్తమూర్తియె సుఁడీ ధ్యేయుండు మాకెప్పుడున్॥
మ॥ నిజమాయాపిహిత త్రిలోకుఁడపయన్నిర్ధూత సర్వాఘుఁడై
యజుఁడయ్యున్ సృజియించు తానెయనసూయాదుగ్ధమానన్
ధరి
త్రి జనింపంగనెనో యమూర్తి తను దద్దివ్యప్రభావేద్యునిన్
సుజనారాధ్యుని దత్తమూర్తినె సదాధ్యానించుచు భావించెదన్ 59
మ॥ సుమతిం బీఠపురీస్థిత ద్విజసతిన్ శుద్ధాత్మ నర్థింప భి
క్షుమిషన్ బైతృక మాపి యాపె నిజకాంక్షం దెల్పఁ దత్పు
త్రుఁడై
ప్రమదంబారఁగ నగ్రజన్ములకుఁ బంగ్వంధత్వముల్ బాపుచున్
యమియై శ్రీపదవల్లభాఖ్యఁ దగెనో యా దత్తుఁ డోమున్నమున్॥
సీ॥ పౌలస్త్యునకు నిజారాధనార్థంబును మాన్పి
ఁ త్తిగొంగనె తెచ్చి యిత్తుననుచుఁ
కైలాసమే యెత్తఁగడఁగిన వారించి
ప్రాణలింగంబిచ్చి పంపె శివుఁడు
హరిపంప గణనాథుఁడని తోఁగొని నేల
మీఁద నుంచిన నాఁడు బాదుకొనియె
ననుఁడిర్వది కేల నాడింప నాలింగ
మెడలమిని మహాబలేశ్వరాఖ్య॥
తే॥ నంది గోకర్ణ సంజ్ఞచే నలరు నచ్చోట
నిద్ధమహిమాఢ్యమానని సిద్ధునోటఁ
జాటఁ జేసి తరింపఁగాఁ బాటఁ జూపె
నట్టి శ్రీదత్తమూర్తి నాకాదరువగు॥ 61
మ॥ కృతపాపౌఘును హీనజన్ము గృశాంగిన్ గుష్టరోగార్త న
జ్ఞతఁ దా వేసినదైన బిల్వదళదో లింగంబంటు మాత్రానఁ బ్రా
పిత కైలాసనొనర్చు దివ్యమహిమాప్తిన్మించు గోకర్ణమం
దెతఁడబ్దత్రితయంబెసంగె నలదత్తేశుండె మాకండయౌన్॥ 62

మ॥ నికృతారిష్టము కృష్ణలోని 'కురుగండి'న్ బైనఁదానుండి యం
బికకున్ సాంబుఁబ్రదోషపూజ సలుపన్ విష్ణుండగున్
సూనుఁడం
చొక గాథం చెలిపెన్ గుపుత్త్రిని మనీషోపేతుఁగావించె వా
రికిఁబ్రాణంబుల నిల్పె నెవ్వఁడలయాత్రేయుండదిక్కెవ్వఁడున్॥

మ॥ నిజసేవాపరతంత్రుఁడై మెలఁగనా నిర్ణేజకుండొక్క మ్లే
చ్ఛ జనాధీశుని వైభవంబుఁగని యాశ్చర్యంబెదంగాంచనే
సుజనారాధ్యుఁడెవండు వాని యవనేశుం జేసి తానజ్ఞదృ
ష్టిఁజరింపం జనకుండునో కురుపురిన్, సేవింతు నాదత్తునేన్॥

మ॥ గురులంగొల్వఁగ సంపదల్పొదలమ్రొక్కుల్దీర్పఁగావల్లభుం
డరుగన్ ఘాతుకులంటివాని వధసేయన్మ్యాలిగా వ్రాలి మ
స్కరులెవ్వా రలతస్కరాళిఁ బొలియంగాఁజేసి జీవింపఁజే
సిరొ భక్తద్విజు, నామహామహుల నేసేవింతు దత్తేశులన్॥

ఉ॥ శ్రీపదబోధ మంబవినిచేయఁ బ్రదోషశివార్చనంగరం
జాపురిఁదత్సుతుండవుచు జన్మమునంది నృసింహనాముఁడై
చూపినలోహమెల్లఁగనఁ జోద్యముగాఁగఁ బసిండిఁజేసెనో
యేపరమాత్ముఁడామహితుఁడేలెడు దత్తుఁడు దత్తచిత్తుఁడై॥

మ॥ ఇలసేతం డుదయించుచేటె మొదలుగానేనాఁడు నోరెత్తమిం
బలుకే బంగరుగా ద్విజత్వమొదవ న్వాక్సిద్ధియై యాగమం
బులనెల్లం దనయంత నే పలుకుచు న్బోధించె వేదాంత వా
క్కుల నాయంబకతండె దిక్కనుచు మ్రొక్కుల్మ్రొక్కుదున్
దత్తునిన్॥ 67

చ॥ కవ లనుజన్మలేర్పడఁగఁగైకొని తల్లి యనుజ్ఞ కాశికే
గి, విగతకల్మషుండెవఁడు కృష్ణ సరస్వతులీఁగ్రిమంబు, వే
దవిహితరీతి సన్న్యసన ధర్మమునంతట నాశ్రయించి యా
శ్రవులకు మోక్షమార్గము నొసంగె నతండలదత్తుఁడేలెడున్॥

చ॥ సకలమహీప్రదక్షిణమిషంబునఁ దీర్థములెల్ల మెట్టి ఛా
త్రకలితుఁడై కరంజనగరంబున నంబకుఁ మ్రొక్కి తన్వి, నా
శికనొకశూల రోగికి విశేషముగానిడి భక్ష్య భోజ్యముల్
సుకృతిహతార్తియై నెగడు స్తుత్యుఁడలంతునుదత్తమూర్తినేఁ॥

కం॥ సాయందేవువధింపఁగ। నేయవనపుఁడెంచెనతనిమెడఁదన్బెడఁదన్
భీయుంగూర్చిమరల్చెనో। చేయూఁత్రయొసంగునాకుశ్రీగురుఁడతఁడే॥

మ॥ అమలోదాత్త సమస్త తీర్థమయుఁడేయాఁగాక తానల్ల క్షే
త్రమహత్త్వంబొగి నుగ్గడించి తన ఛాత్రశ్రేణినెల్లఁ నిజా
శ్రిమధర్మంబుల వీడకుండ నిలసంచారంబుఁగావింపఁ బం
పె, మహాభాగుఁడెతండొ తద్గురుని సేవింపంగ నన్బ్రోవఁడే?॥

మ॥ వరవైద్యేశ్వర సన్నిధానమున గుప్తప్రక్రియన్నిద్ధుతో
జరుపన్వత్సరకాలమొక్కెడఁగుశిష్యత్వానుపాత్రోపల
బ్ధి రిరక్షింగనుమన్న, సిద్ధగురుభక్తింగొల్వ నేయంచు ది
ద్ది రహింగూర్చిరొ తద్గురూత్తములె యర్థింగొల్చు నన్నేలరే?॥

ఉ॥ అందఱు నిందవందురునొకార్తుఁడు పండితపుత్రుఁడైన ధీ
మంనుఁడు జిహ్వ కాళికి సమర్పణముంబొనరించి శీర్షమీ
యం దఱియంగవాని నుమ యాంపిన మస్తకమందు హస్తముం
పందళితాజ్ఞతాప్తిఁ బ్రతిపత్తిని గూర్చెనొ కొల్తుఁ దద్గురుఁ॥ 73

చ॥ తిరిపెమె జీవనంబయినఁ దృప్తమనస్కుఁడుఁ గర్మనిష్ఠుఁడై
దొరకమి వాకిటం బెరుఁగు దొగ్గలికూరమె మెక్కుచుండు భూ
సురుఁడిడు శాకభిక్షఁగొనుచున్నిధివానికిఁ గూర్చిపోవు సా
దరునమరేశ్వర స్థితుని దత్తగురూత్తము నాశ్రయించెదఁ॥

సీ॥ నరసింహ నఖతాపహార ఫలాకీర్ణమ
　　　హొదుంబరచ్ఛాయ నాశ్రయించి
ఘనచతుష్షష్టి యోగినుల సేవలఁగొనఁ
　　　గంగానుజుఁడు చేల కాపరికని

మహిని వారాణాసీమహిమంబు నరయంగఁ
గరుణించి నిజపాదుకలఁ గొనుమని
క్షణమునఁ దివ్యస్థలీగమనంబలవరించి
మరలించి సంగమమహిమఁ దెలిపి

తే॥ తా నుదుంబరమున గుప్తతంగసుటను
భక్తకల్పద్రుమంబుగాఁ బరగఁ జేసి
సుగురుఁ డేతఁడు గంధర్వ నగరమందుఁ
జేరెనా దత్తనరహరి సేవ్యుఁడెంము॥ 75

మ॥ తన ద్రవ్యంబు హరించు బ్రాహ్మణిని భూతంబాచు బాధించువి
ప్రుని ప్రేతత్వమునొర్ధ్వ దైహికములా ప్రోయాలిఁగావింపఁ జే
య నశింపంబొనరించి పుత్త్రిపరకుండయ్యె న్నతిభక్తి భా
వనమూఁడంగ నుదుంబరాశ్రమునన్ బ్రార్థింతుఁ దచ్ఛ్రీపదమున్॥

మ॥ వరలబ్ధాత్మజుఁడయ్యె బాల్యమునఁ బోవన్మాతయుత్కార్తి చే
వరదాతన్నిరసింపఁ దాసవుఁడునైవచ్చెం బ్రబోధింపఁగాఁ
బరమార్థంబబలా మనోద్రఢిమ సంభావ్యంబుగా నేయుడుం
బరవాసుండలబిడ్డకిచ్చె నసువుల్, వర్ణింతుఁ దచ్ఛ్రీగురున్॥ 77

మ॥ వరభీమామరజాఖ్యసంగమ సమీపస్థంబుగంధర్వ న
త్పురమందొక్కెడ గొడ్డుగేదెఁబితుకన్ దుగ్ధంబు బిక్షార్థమీ
య రచించెన్ మఱితద్గృహంబునను సర్వార్థంబులంగూర్చి సం
బరమొప్పించెనెవండుతద్గురుఁడిలన్ వంద్యుండుమాకెయ్యెడన్॥

మ॥ నరపాలార్థితుఁ డేమహామహుఁడు యానారూఢుఁడై గాణగా
పురమందొక్క మఠంబుఁ జేసుతఱి తావున్నీడనశ్వత్థ సు
స్థిరుఁడై యుండిన బ్రహ్మరక్కసుఁ గృతార్థీభూతుఁగావించె నా
నరసింహాకృతిదత్తమూర్తి నికతానందప్రదుండయ్యెడున్॥ 79

మ॥ కుమసీవాసిఁ ద్రివిక్రమున్ నృహరిభక్తున్ దూషితాత్మీయ చ
ర్య, మదుంగంబొనరింప నేఁడు శిబికారూఢుండుగా నేగి, భ్రాం

తమసస్కంఠుగ విశ్వరూపమును సంధానంబుఁ గావించి మిం
చె, మహోత్సాహుఁడు దత్తమూర్తి యతనిన్ సేవింతు నుద్య
త్ప్రభున్॥ 80

మ॥ కుమతిన్ మ్లేచ్ఛునిఁ జేరి మెచ్చుకొనవాక్యాంతరత్వమే పార, వా
దమొనర్పం జను దుర్విదగ్ధులను విద్వద్వేషులం దాఁ ద్రివి
క్రముఁ డే సద్గురుఁ డేర్చ వారల కనర్థప్రాప్తి యౌ నుండు గ
ర్వము వీడుండని నేర్పుఁ జూచెన తనిన్ బ్రార్థింతు నశ్రాంతమున్॥

శా॥ తా నేతండల గర్వధూర్వహులకుద్యద్వైదుషిన్ వేదశా
ఖానేకంబుల నుగ్గడించినను దుర్వ్యాపారమున్మానమిన్
హీనుండొక్కని భస్మలేపనమునన్ వేదార్థవేత్తృత్వసం
ధానంబొప్పఁగఁ జేసి మాన్పె నతనిన్ ధ్యానింతు దత్తప్రభున్॥

మ॥ కృతవేత్తృప్రతిపాదితార్థములలోఁ గృత్స్నంబుగా లోకదు
ష్కృతులం గర్మవిపాకముం దెలిపి నిశ్శ్రీకంబుగాఁ గాఁ ద్రుటిన్
జ్యుతవేత్తృత్వమపాత్ర భస్మత మహాంహోరాశి కల్పించెనో
యెతఁ డాతండల దత్తసద్గురుఁడె నాకెందు స్మరణ్యుండిలన్॥ 83

మ॥ ఒకరాకాసికి వామదేవకృత భస్మోత్కర్షబోధమ్ము పా
తకముల్వీడఁగఁ జేయ దానవకృతార్థత్వంబిలం గాంచుటల్
ప్రకటప్రక్రియగాఁ ద్రివిక్రమున కెవ్వండాప్త తం దెల్పె న
య్యకలంకోత్తమ దత్తసద్గురు శరణ్యత్వంబిఁకన్ గణ్యమౌన్॥

శా॥ గోపీనాథసమాఖ్య విప్రసుతుఁ డొక్కండొక్కటన్ రుగ్ణుఁడై
నాపన్నస్థితిఁ గొంచుఁ దత్సతియు డాయన్ రా నతం డీల్గుటన్
బ్రాపెవ్వండయి యోగిరూపమునఁ బ్రోవన్వచ్చె వేదాంతవి
ద్యాపూర్ణుండతఁడే శరణ్యుఁడెట దత్తాత్రేయుఁ డీధాత్రిలోన్॥

మ॥ దివినంటం జను వింధ్య వంచుటకునై దేవేంద్రుఁ డా కుంభ సం
భవు దర్శించుతఱిన్ బృహస్పతియె లోపాముద్రఁ దానెంచుచున్
యువతీధర్మములిట్లు పల్కెననియే యోగీంద్రవేషుండు సె
ప్పె విదగ్ధుండల దత్తసద్గురుని సేవింతు స్మరణోత్తమున్॥ 86

మ॥ మొదటన్ శ్రేష్ఠునటంచు భర్త్రనుగమంబుంబల్కి సావిత్రికిన్
విధవాధర్మములుగ్గడించి కృపతోవీక్షించి రుద్రాక్ష భ
స్మదుఁడౌచు న్నిజపాద్యసేకమునఁ దత్స్వామిన్ గతప్రాణువిన్
బ్రదికింపంగనె రక్షకుండతఁడె ప్రోవంగోలునాసద్గురున్॥ 87
సీ॥ గుణరూపములకిక్క గణికయొక్కతెమించె
నిజసఖీవృత నిత్యనృత్యగరిమఁ
దన్నాట్యమంటపాంతర్వర్తి కుక్కుట
మర్కటాల్ రుద్రాక్షమండితములు
గారత్నలింగంబు కరమందు నింపొంద
భస్మలిప్తాంగుండు వచ్చెనటకు
వచ్చిన యాశివవ్రతి నదివరియింప
నదియు శివవ్రతియాట యరయ॥
తే॥ మంటపముఁజొచ్చి తానందు మ్రగ్గనదియు
మ్రందియందున్న కుక్కుటమర్కటములె
యక్షధారణ నృపసూనులైనటనుచుఁ
దెలుపు గురుమూర్తికిద్దె యంజలి ఘటింతు॥ 88
మ॥ మృతులౌద్వాదశహాయనుల్బ్రతుకఁగాశ్మీరాధిరాడ్భద్రసే
న తనూజాతులకు న్పరాశరులు దేనన్ గూర్చిరో ప్రాణమా
శతరుద్రీయమహత్త్వముందెలిపె దృష్టాంతంబుతో నేఁడు త
న్నుతచారిత్రుసి భక్తవత్సలు శరణ్యుండంచు ధ్యానించెదన్॥
సీ॥ సంజీవనీమంత్రసారంబుఁగోల్పోవె
దేవయానికి నేర్పదితిజగురుఁడు
కానఁగూడదు చెప్పఁగా మంతు లింతుల
కీశుల సేవయే యిష్టదమని
పలుకమైత్రేయి సౌభాగ్యప్రదముగాఁగఁ
జితవర్మ కుమారిచేసె వినుము
సీమంతినీదేవి సోమవారవ్రతా
చరణంబె మృతభర్తమరలిచెనని

తే॥ యెవఁడు సావిత్రికిన్ లోకహితముగాఁగ
నల్లచంద్రాంగద చరిత్రమెల్లఁబలికె
నా నృసింహ సరస్వతీయతివరేణ్యుఁ
డౌ శరణ్యుఁడు మాకు నయ్యత్రిజుండు॥ 90

మ॥ ఒకవిప్రుండు పరాన్నమొల్లమిని బత్యుత్కంఠఁదీర్పించి యా
హ్నికకర్మాళి గృహస్థధర్మము లెఱింగించెన్ ద్విజప్రత్యవా
యకరవ్యాపృతులార్ప ముక్తిపదమందాసక్తియుం గొల్పనే
యకలంకుండల దత్తసద్గురు శరణ్యత్వంబగణ్యంబిలన్॥ 91

కం॥ సోలెడు బియ్యమెవండినఁ। జాలనదే నాల్గువేలు జనమున్
దనుపన్
లీలనెవండగపఱిచెనో! యేలున్గురుదత్త సిద్ధుఁడిల మమ్మతఁడే॥ 92

కం॥ ఏవాఁడశ్వత్థమహ।త్త్వావిష్కృతి కనఁగవంధ్యయానిష్కశఁబు
త్త్రావిర్భవమందించెనొ।యావరదుఁడె దత్తమూర్తియా
మమ్మోమన్॥ 93

సీ॥ భవపూజనము చితాభస్మంబుతోఁ జేయ
శబరునకు క్తమా సరణిఁబట్టి
తనయింటినిల్లాలి దగ్ధంబుఁగావించి
భస్మార్పణమొనర్ప భవుఁడు ప్రోచెఁ
గుష్ఠద్విజుఁడు శుష్కకాష్ఠంబు చిగిరించు
దనుక నశ్వత్థసేవను బూనర్ప
నేఁజెప్పుచొప్పునఁదాఁ జేయుటనుసిద్ధి
కాంచఁడే చూడుఁడీయంచుఁబలికి॥

తే॥ నిజకమండలూదకమున నిమిషముననె
కట్టెచిగిరించి యంతలోఁజెట్టుగాఁగఁ
జేసి కుష్ఠమువాపి రక్షించెనెవ్వఁ
డట్టి గురుమూర్తి నేయింక నాశ్రయింతు॥

సీ॥ నామధారకవంశనాథ సాయందేవుఁ
డోరిమితోఁ గొల్చుచుండుతఱిని
నడిరేయిజడివడి తడిసినమొడనగ్గి
కరిగిత్రోవనుదప్పి తిరిగిరాఁగ
మును త్వష్టగురుసేవ మానుకవఁజేయంగ
గృహనిర్మితియతండు గృహిణికైక
బుకుతండు పాదుకల్ పుత్రికదుద్దులున్
దంతపుబొమరింటిఁ దనరుపుమన
తే॥ వల్లెయని మాటడక్కిడి వడువెదియని
కడుఁదపింప మహాత్ముఁడు కాశిఁజేర్చి
విశ్వకర్మునిఁగాఁజేయు విధమెవండు
తెలిపెనాదత్తగురున కంజలిఘటింతు॥ 95

శా॥ ఆఁదంచెవ్విధి వారణాసిచగునో యాత్రాక్రమంబద్ది చె
ప్పందదృశ్యములెల్లఁగాంచ నెదుటన్ భాసింపఁగాఁజేయ సా
యాందేవున్నకుటుంబ మాప్తతనుడాయాఁజేయ నేగేయుఁడెం
చెందద్భక్తశరణ్యాసద్గురు వకున్సేవింతు నశ్రాంతమున్॥ 96

సీ॥ దీక్షశీలాఁగని దివికేగఁ గర్కశ
నింతిగాఁగొనియె సుమంతుఁడంతఁ
గౌండిణ్యునకు శీలకాంతయాచు ననంతుఁ
బూజించిసంపదల్ పొందలనెసఁగఁ
దద్భర్తతోరంబు తగులఁబెట్టుటసిరుల్
కరిమ్రింగిన వెలఁగ కరణిఁగాఁగ
నయ్యనంతుండేడనని రోయనతాన్యక్షఁ
గౌండిణ్యుఁడెటు తన్నుఁగనఁ గలిగెనొ॥
తే॥ తెలిపికృష్ణుఁడు ధర్మజుఁడేర్చెననుచుఁ
జెప్పియయ్యనంతాఖ్యుఁ బూజింపఁజేసి
కొనుచు నెవఁడు సాయందేవుఁగూర్చె సిరుల
నట్టి శ్రీదత్తగురుఁడె నాకాదరువగు॥ 97

చ॥ అనుకొనినంతఁదంతుకు మహాశివరాత్రిని శ్రీగిరీంద్ర యా
త్రనుబూనకంపయోగగతిఁ దాఁగొనిపోయి కుముద్వతీ విమ
ర్షణులెటు తొల్లిపావురము శ్వానమునై, కృతతత్ప్రదక్షిణా
ప్తిని నృపులైరో తచ్చరితఁ జెప్పెడు శ్రీగురునాశ్రయించెదన్॥

శా॥ కాళీచందలలంబురశ్చ్చరణమున్‌గావించు నందయ్యకాం
దోళింపన్ప్రాదినే నృసింహగురుపాదుల్ మొక్కనా దిక్కనన్
వైళంబేతనిఁజేరఁ గుష్ఠమును బాపన్ దృష్టిమాత్రాన, సం
బాళింపంగనిఁజేయఁగల్గె నతనిన్ బ్రార్థింతు దత్తప్రభున్। 99

మ॥ కవితాకేసరియానృకేసరి సదా కల్లేశు నేకొల్తు నిం
కెవనిన్ గేయునిఁగాఁ దలంపననికో నేతండుతత్స్వప్నమం
దవగీర్ణుండయినట్లు తోఁచి తజియన్ న్యాసక్తునింజేసి పా
దవనేజ భ్రమరంబూనర్చికొనె నాదత్తప్రభుం జేరుదున్॥ 100

మ॥ ఒకదీపావళినష్టరూపములతో నూహాం భక్తాళి కా
నికలర్పింప సపర్యల న్నతుల నంచె న్సర్వసంతుష్టికే
యకలంకోత్తమ యోగిసత్తముఁడు దత్తాత్రేయుఁడే తానవై
న కృపాపూర్తి నృసింహమూర్తి యతనిన్ ధ్యానింతు
నిష్టాప్తికై॥ 101

మ॥ తననారెల్లరుఁగాంచినారలును నిందల్సేసిన న్మాఘభ
క్తిని శూద్రుండు కృషీవలుండల గురూక్తిన్ జొన్నచేనెల్లఁబం
డనినాఁడే తెగఁగోయ మిక్కుటపుఁబంటన్వేగఁబండింపఁజే
సెనెవండా నరసింహమూర్తిని నమస్తేయంచుపాసించెదన్॥ 102

సీ॥ జాలంధరహత నిర్జరులకై శివుఁడిచ్చు
నమృతమందలి శేషమమరజయని
సంగమేశ్వరుఁడె గోస్వామి ప్రార్థనమున
విశ్వేశుఁడై యట్లు వెలసెననుచు
మార్జార హతిఁగుష్ఠమయగాత్ర రత్నాంబ
క్లేశమడఁచు పాపనాశమిదని

కోటితీర్థంబిదిగో గయాతుల్యంబు
కలేశుఁడితఁడె మోక్షప్రదుఁడని
తే॥ త్రిస్థలీమహిమంబష్టతీర్థగరిమ
నచటనేకద్దు సుండని యందఱును
జాటె నేమేటియాత్రని దీటుఁగనము
దికలాతఁడె దత్తగురుమూర్తి మ్రొక్కుదునిదె॥ 103
సీ॥ శ్రీపాదభక్త నిర్ణేజకుండై మ్లేచ్ఛ
భూపతి వైడూర్యపురము నేల
నతనిస్ఫోటార్తికి నాశ్రితవిప్రులు
సాధుదృష్టియడంచు సంశించెలుప
వజ్రబాహుతనూజ వ్రణదిగ్ధదేహుని
ఋషభయోగీశ్వరుదృష్టిమున్ను
ప్రాగ్జన్మసుకృతాప్తిభద్రాయువుం జేసె
నన 'గాణగాపురి' కరుగ నృపతి
తే॥ యెవనిచూడికాని రజవాసి యెఱుకగలిగె
మ్లేచ్ఛుఁడని తోసిపుచ్చక యిచ్చెఁదీర్పఁ
దద్గృహంబున మెట్టి యుద్ధరయయ్యె
నే నృసింహసరస్వతి యేలునతఁడె॥ 104
ఉ॥ పాలితభక్తలోకుఁడు కృపాపరిపూర్తి యపాకృతార్తి శ్రీ
శైలమునం దిరోహితుఁడు సద్గురుమూర్తి యెతండుగా నిలన్
గీలితపుష్పపీఠుఁడరిగెన్ సరిదంతరగామి యూప శి
ష్యాలి ప్రసాదపుష్పముల నందఁగ నాతఁడె తేర్చు మమ్ములన్
ఉ॥ ఎవ్వఁడు సహ్యశైలముననే తగి యర్ఘ్యము 'కాశి'గైకొనున్
బువ్వకోలాపురంబునకుఁబోయి గ్రహించును, 'విఠ్ఠలాఖ్య'మా
చివ్వకునంతలోఁజను విచిత్రముగానల "గాణగా" కదేన్
దవ్వనఁబోఁడెతండెది సదా "కురుగండి" కినట్టులేకదా॥
ఉ॥ చొక్కపుమేనివాఁడు కడు సొంపగు తామరమోమువాఁడుబల్
చక్కని తమ్మి రేకులకుఁ జాలగు కన్నులవాఁడు నిమ్ములన్

దక్కినవాఁడు నిక్కముగ దక్కొనువాఁడు కమండలంబుచేఁ
జిక్కినవాఁడు సుద్దినగుఁ జెన్ననసూయకుఁ గన్నవాఁడహో॥

చ॥ 'జయజయ దేవదత్త! త్రిదశప్రతతి ప్రథితాభిపూజితా
జయజయ వర్ణ్య నిత్య! సదసద్వివదభిజ్ఞ బుధైక సాధితా
జయజయ సత్యభావ! నుతసంయమి లోకశరణ్య దేశికా
జయజయ భద్ర!' యందు విలసచ్ఛుభదాప్రతిమానభావుకా॥

సీ॥ స్రష్టా! విసృష్టాష్టకష్టా! వినష్టారి
చేష్టా! ప్రకృష్టేష్ట దృష్టిఁగొనుము
కర్తా! త్రిలోకైకభర్తా! తతఙ్మ్లవి
హర్తా! సమస్తాఘ హర్త! నతులు
శ్రీదత్తమూర్తి! ప్రసిద్ధాచ్ఛకీర్తి! న
తార్థి ప్రపూర్తి! హతార్తి! యివిగో
బృందారకాగ్రియ! వందారు భక్తౌఘ
మందార! కైకొమ్ము వందనములు॥

తే॥ సర్వదుష్టాసురానీక గర్వహరణ
సచ్చిదానందమూర్తి! ప్రశాంతవర్తి
వారితాశ్రితజనజూర్తి! భావపూర్తి
సారెసారెకు నీకు జోహారులివె॥ 109

—♦ కవిరాజ విరాజితము ♦—

నరహరి! నీచరణంబనయంబు మ
నఃఫలకంబున నాటుకొనన్
శరణను చుండఁగ సారెకు సారెకు
సాధుగురూత్తమ! సాదుమినన్
గరుణనుజూడు మగాధభవాంధవి
కర్తనమూర్తి! యఘంబడఁగన్
గరమనురక్తిని గామితదాత జ
గన్నుతనేత! సుఖం బిడఁగన్॥ 110

## మంగళ మహాశ్రీ

శ్రీపదములు వల్లభ నృసింహ యతులంచిలఁ బ్రసిద్ధిఁగను దత్తగురుమూర్తి!
నీపదజలేజముల నేనయి ద్విరేఫమను నిక్కఁడు సుపాత్రవరకీర్తి!
యాపదలఁబాపఁదగు నాదరువ వీవయిన నందఱికమంగళ మడంగున్
జూపఁదగు ప్రేమమును జూపిన "సుధారసపు" ఘోషమున మఙ్గళమెసంగున్॥

ఇతి శ్రీ మేధా దక్షిణామూర్తీశ్వరాక్షీణ కరుణాకటాక్ష వీక్షాపాత్ర
నాదెళ్ల పురుషోత్తమ కవీంద్ర పుత్ర మేధా దక్షిణామూర్తి
నామధేయ విద్వద్విధేయ కర్తృకమైన

దత్తభావసుధారసము.

గురుపాదార్పణమస్తు.

సంపూర్ణము.

---

## సవరణలు

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 5 | చేని | చె, ని |
| 8 | 17 | దెవ్వు | దెప్పు |
| 8 | 17 | నన్య | ననన్య |